# అథ ఏకోన చత్వారింశో%ధ్యాయః

## మూకాసురవధ

నందీశ్వర ఉవాచ|

స్నానం స విధి వత్ కృత్వా న్యాసాది విదివత్తథా | ధ్యానం శివస్య సద్భక్త్యా వ్యాసోక్తం యత్తథా%కరోత్ || 1

ఏకపాదతలేనైవ తిష్ఠన్మునివరో యథా | సూర్యే దృష్టిం ని బధ్యైకాం మంత్రమావర్తయన్ స్థితః || 2

తపస్తేపే%తి సంప్రీత్యా సంస్మరన్మ నసా శివమ్ | పంచాక్షరం మనుం శంభోర్జపన్ సర్వోత్తమోత్తమమ్ || 3

తపసస్తేజ ఏవాసీద్యథా దేవా వి సిస్మియుః | పునశ్చైవ శివం యాతాః ప్రత్యూచుస్తే సమాహితాః || 4

నందీశ్వరుడిట్లు పలికెను-

ఆతడు యథావిధిగా స్నానమాచరించి, న్యాసాదుల ననుష్ఠించి, వ్యాసుడు ఉపదేశించిన తీరున మంచి భక్తితో శివుని ధ్యానించెను (1). ఆతడు మహర్షి వలె ఒంటి కాలిపై నిలబడి సూర్యునియందు దృష్టిని ఏకాగ్రము చేసి మంత్రమును జపించెను (2). ఆతడు మనస్సులో శివుని స్మరిస్తూ సర్వశ్రేష్ఠమగు పంచాక్షరీ మంత్రమును జపిస్తూ శివునిపై మహాప్రీతితో తపస్సును చేసెను (3). ఆతడు తపస్సును చేయుచుండగా బయల్వెడలిన తేజస్సును గాంచి ఆ దేవతలు చకితులై మరల శివుని వద్దకు వెళ్ళి సమాహిత మనస్కులై ఇట్లు పలికిరి (4).

దేవా ఊచుః |

నరేణైకేన సర్వేశ త్వదర్థే తప ఆహితమ్ | యదిచ్ఛతి నరసో%యం కింన యచ్ఛతి తత్ర్పభో || 5

దేవతలిట్లు పలికిరి-

ఓ సర్వేశ్వరా! ఒక నరుడు నీకొరకై తపస్సును చేయుచున్నాడు. ప్రభో! ఆతని కోర్కెను నీవు ఏల తీర్చరాదు? (5)

నందీశ్వర ఉవాచ|

ఇత్యుక్త్వా తు స్తుతిం చక్రుర్వివిధాం తే తదా సురాః
తత్పాదయోర్దృశః కృత్వా తత్ర తస్థుస్థిరాధయః || 6

శివస్తు తద్వచశ్శ్రుత్వా మహాప్రభురుదారధీః | సువిహస్య
ప్రసన్నాత్మా సురాన్ వచనమబ్రవీత్ || 7

నందీశ్వరుడిట్లు పలికెను-

అపుడు దేవతలిట్లు పలికి అనేకస్తుతులను చేసి శివుని పాదములపై చూపును నిలిపి ఏకాగ్రమగు మనస్సు గలవారై అచట నిలబడి యుండిరి (6). ఉదారబుద్ధి గలవాడగు శివమహాప్రభుడు వారి మాటలను విని ప్రసన్నమగు అంతఃకరణము గలవాడై నవ్వి దేవతలతో నిట్లు పలికెను (7).

శివ ఉవాచ |

స్వస్థానం గచ్ఛత సురాస్సర్వే సత్యం న సంశయః | సర్వథా%హం కరిష్యామి కార్యం వో నాత్ర సంశయః || 8

శివుడిట్లు పలికెను-

దేవతలారా! మీరందరు మీ స్థానములకు వెళ్లుడు. ఇది నిశ్చితము. సందేహము వలదు. మీ కార్యమును నేను అన్ని విధములుగా పూర్తి చేయగలను. సంశయము వలదు (8).

నందీశ్వర ఉవాచ |

తచ్ఛ్రుత్వా శంభువచనం నిశ్చయం పరమం గతాః | పరావృత్య గతాస్సర్వే స్వస్థానం తే హి నిర్జరాః || 9

ఏతస్మిన్నంతరే దైత్యో మూకనామాగతస్తదా | సౌకరం రూపమాస్థాయ ప్రేషితశ్చ దురాత్మనా || 10

దుర్యోధనేన విప్రేంద్ర మాయినా చార్జునం తదా | యత్రార్జున స్థ్సితాశ్చాసీత్తేన మార్గేణ వై తదా || 11

శృంగాణి పర్వతస్యై#్యవ ఛిందన్ వృక్షాననేకశః | శబ్దం చ వివిధం కుర్వన్ అతివేగేన సంయుతః || 12

అర్జునో%పి చ తం దృష్ట్వా మూకనామాసురం తదా | స్మృత్వా శివపదాంభోజం విచారే తత్పరో%భవత్ || 13

నందీశ్వరుడిట్లు పలికెను-

శంభుని ఆ వచనములను విని ఆ దేవతలు అందరు దృఢమగు విశ్వాసమును పొందిన వారై వెనుదిరిగి తమ స్థానములకు వెళ్లిరి (9). ఇంతలో అచటకు మూకుడనే రాక్షసుడు సూకరూపమును దాల్చి వచ్చెను. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! దుర్బుద్ధి, మాయావి యగు దుర్యోధనుడు వానిని అచటకు పంపియుండెను. ఆ రాక్షసుడు ఆ మార్గముననుసరించి అర్జునుడు ఉన్న స్థలమునకు వచ్చి అర్జునునిపై దండెత్తుటకు సిద్ధమాయెను (10, 11). ఆతడు పర్వతశిఖరములను కూలగొట్టుచూ వృక్షములను ముక్కలు చేయుచూ మహావేగముతో కూడినవాడై వివిధ శబ్దములను చేయుచుండెను (12). అర్జునుడు ఆ మూకాసురుని గాంచి, శివుని పాదపద్మములను స్మరించి గాఢముగా ఆలోచించ మొదలిడెను (13).

అర్జున ఉవాచ |

కో%యం వా కుత ఆయాతి క్రూరకర్మా చ దృశ్యతే | మమానిష్టం ధ్రువం కర్తుం సమాగచ్ఛత్య సంశయమ్ || 14

మమైవం మన ఆయాతి శత్రురేవ న సంశయః | మయా వినిహతాః పూర్వమనేకే దైత్యదానవాః || 15

తదీయః కశ్చిదాయాతి వైరం సాధయితుం పునః | అథవా చ సఖా కశ్చిద్దుర్యోధనహితావహః || 16

యస్మిన్ దృష్టే ప్రసీదేస్త్వం మనస్స హితకృద్ధ్రువమ్ | యస్మిన్ దృష్టే తదేవ స్యాదాకులం శత్రురేవ సః || 17

ఆచారః కులమాఖ్యాతి వపురాఖ్యాతి భోజనమ్ | వచనం శ్రుతమాఖ్యాతి స్నేహమాఖ్యాతి లోచనమ్ || 18

ఆకారేణ తథా గత్యా చేష్టయా భాషితైరపి | నేత్రవక్త్ర వికారాభ్యాం జ్ఞాయతేంతర్గతం మనః || 19

ఉజ్జ్వలం సరసం చైవ వక్ర మారక్తకం తథా | నేత్రం చతుర్విధం ప్రోక్తం తస్య భావం పృథగ్ బుధాః || 20

అర్జునుడిట్లు పలికెను-

ఇది ఎవరు? ఎచట నుండి వచ్చుచున్నది? క్రూరమగు కర్మ కలదివలె కన్పట్టు చున్నది. ఇది నాకు హాని చేయుటకు వచ్చుచున్నదనుట నిశ్చయము; సందేహము లేదు (14). ఇది నాకు శత్రువు అనియే నాకు మనస్సులో తోచుచున్నది. సందేహము లేదు. నేను పూర్వము నందు అనేకులగు దైత్యులను, దానవులను, సంహరించి యుంటిని (15). వారి బంధువులలో ఒకరు మరల పగ దీర్చుకొనుటకు వచ్చియుండును. లేదా, దుర్యోధనుని మిత్రుడు ఆతనికి హితమును చేయగోరి వచ్చియుండును (16). ఎవనిని చూసినచో మనస్స ప్రసన్నమగునో, ఆతడు హితమును చేయును. ఇది నిశ్చయము. ఎవనిని చూడగనే మనస్సు వ్యాకుల పడునో వాడు శత్రువే అగును (17). ఆచారము కులమును, శరీరము భోజనమును, వచనము జ్ఞానమును, చూపు స్నేహమును స్పష్టము జేయును (18). ఆకారము, నడక, చేష్ట, మాటలు, చూపులు, ముఖకవళికలు అనువాటిని బట్టి మనస్సులో దాగియున్న భావమును పసిగట్టవచ్చును (19). ఉజ్జ్వలమైనది, సరసమైనది, వంకర, మిక్కిలి ఎర్రనిది అని కన్ను నాల్గు తెరంగులనున్నది. వీటి భావములు కూడ వేర్వేరుగా నున్నవని పండితులు చెప్పుచున్నారు (20).

ఉజ్జ్వలం మిత్రసంయోగే సరసం పుత్ర దర్శనే | వక్రం చ కామినీ యోగే ఆరక్తం శత్రుదర్శనే || 21

అస్మిన్మమ తు సర్వాణి కలుషానీంద్రియాణి చ | అయం శత్రుర్భవేదేవ మారణీయో న సంశయః || 22

గురోశ్చ వచనం మే%ద్య వర్తతే దుఃఖదస్త్వయా | హంతవ్యస్సర్వథా రాజన్నాత్ర కార్యా విచారణా || 23

ఏతదర్థం త్వాయుధాని మమ చైవ న సంశయః | విచార్యేతి చ తత్రైవ బాణం సంస్థాయ సంస్థితః || 24

ఏతస్మిన్నంతరే తత్ర రక్షార్థం హ్యర్జునస్య వై | తద్భక్తేశ్చ పరీక్షార్థం శంకరో భక్తవత్సలః || 25

విదగ్ధ భిల్లరూపం హి గణైస్సార్థం మహాద్భుతమ్ | తస్య దైత్యస్య నాశార్థం ద్రుతం కృత్వా సమాగతః || 26

బద్ధ కచ్ఛశ్చ బస్త్రీ భిర్బద్ధేశానధ్వజస్తదా | శరీరే శ్వేతరేఖాశ్చ ధనుర్బాణముతస్స్వయమ్ || 27

మిత్రునితోడి కలయికలో కన్ను ఉజ్జ్వలముగను, పుత్రుని చూచినపుడు ప్రేమ పూర్ణము (సరస)గను, ప్రియురాలితో గూడియున్నప్పుడు వక్రముగను, శత్రువును చూచినపుడు మిక్కిలి ఎర్రగను ఉండును (21). వీనిని చూచినంతనే నా ఇంద్రియములన్నియు కలుషితములైనవి. కావున వీడు నిశ్చయముగా శత్రువు అగును. వీనిని నిస్సంశయముగా సంహరించవలెను (22). ఈ విషయములో నాకు గురువు యొక్క అనుమతి గలదు. 'ఓ రాజా! నీకు దుఃఖమును కలిగించు వానిని నిస్సంశయముగా సర్వవిధోపాయములతో సంహరించుము' అని నాకు గురువు చెప్పియున్నాడు (23). అందుకొరకు మాత్రమే నేను ఆయుధములను ధరించి యున్నాను. అర్జునుడిట్లు తలపోసి బాణమునెక్కుపెట్టి అచటనే నిలబడి యుండెను (24). ఇంతలో భక్తవత్సలుడగు శంకరుడు అర్జునుని రక్షించుట కొరకు, ఆతని భక్తిని పరీక్షించుటకు అచటికి విచ్చేసెను (25). ఆయన

అత్యద్భుతము, సర్వసమర్థము అగు బిల్ల రూపమును దాల్చి గణములతో గూడి ఆ రాక్షసుని సంహరించుట కొరకై అచటకు శీఘ్రముగా విచ్చేసెను (26). ఆతడు పంచను గట్టిగా బిగించి కట్టెను. వస్త్ర శకలములతో ఈశాన ధ్వజమును బంధించెను. ఆయన శరీరమునందు తెల్లని రేఖలు ఉండెను. ఆయన స్వయముగా ధనుర్బాణములను ధరించి యుండెను (27).

బాణానాం తూణకం పృష్ఠే ధృత్వా వై స జగామ హ | గణశ్చైవ తథా జాతో భిల్లరాజో%భవచ్ఛివః || 28

శబ్దాంశ్చ వివిధాన్ కృత్వా నిర్య¸° వాహినీపతిః | శూకరస్య ససారాథ శబ్దశ్చ ప్రదిశో దశ || 29

వనేచరేణ శ##బ్దేన వ్యాకులశ్చార్జునస్తదా | పర్వతాద్యా శ్చ తైశ్శబ్దైస్తే సర్వే వ్యాకులాస్తదా || 30

అహెూ కిం ను భ##వేదేష శివశ్శుభకరస్త్విహ | మయా చైవ శ్రుతం పూర్వం కృష్ణేన కథితం పునః || 31

వ్యాసేన కథితం చైవం స్మృత్వా దేవైస్తథా పునః | శివశ్శుభకరః ప్రోక్తశ్శివస్సుఖకరస్తథా || 32

ముక్తిదశ్చ స్వయం ప్రోక్తో ముక్తిదానాన్న సంశయః | తన్నామస్మరణాత్పుంసాం కల్యాణం జాయతే ధ్రువమ్ || 33

భజతాం సర్వభావేన దుఃఖం స్వప్నే%పి నో భ##వేత్ | యదా కదాచిజ్జాయేత తదా కర్మసముద్భవమ్ || 34

ఆయన బాణముల తూణీరమును వెనుక దాల్చి ముందుకు సాగెను. శివుడీ తీరున భిల్లరాజై నడువగా గణములు కూడ అటులనే సంసిద్ధమయ్యెను (28). సేనాధ్యక్షుడగు శివుడు వివిధశబ్దములను చేయుచూ బయల్వెడలెను. ఇంతలో సూకరము యొక్క శబ్దము పదిదిక్కులలో వ్యాపించెను (29). ఆ సూకరము యొక్క ధ్వనిని విని అర్జునుడు కలవరపడెను. పర్వతములు ప్రతిధ్వనించెను. ఇతర ప్రాణులన్నియు కలవరపడెను (30).

ఏమి ఈ ఆశ్చర్యము! ఇది ఏమై ఉండును. ఇచట శివుడు శుభమును చేయునని పూర్వము నేను కృష్ణుడు చెప్పగా విని యుంటిని (31). వ్యాసుడు స్మరణకు దెచ్చుకొని అటులనే చెప్పియుండెను. శివుడు శుభమును, సుఖమును కలిగించునని దేవతలు కూడ మరల చెప్పియుండిరి (32). ఆయన స్వయముగా ముక్తిని ఇచ్చుట వలన ఆయన ముక్తిదుడైనాడు. సందేహము లేదు. ఆయన యొక్క నామమును స్మరించు మానవులు కల్యాణమును పొందెదెదరనుట నిశ్చయము (33). ఆయనకు సర్వాత్మభావముతో భజించువారికి స్వప్నములోనైననూ దుఃఖము కలుగదు. లేనిచో ఎప్పుడైననూ దుఃఖము సంప్రాప్తమైనచో, అది కర్మజనితమని తెలియవలెను (34).

భావి తద్బహ్వాపి జ్ఞేయం నూనమల్పం న సంశయః | ప్రారబ్ధస్యాథ వా దోషో నూనం జ్ఞేయో విశేషతః || 35

అథవా బహు చాల్పం హి భోగ్యం నిస్తీర్య శంకరః | కదాచిదిచ్ఛయా తస్య దూరీకుర్యాన్న సంశయః || 36

విషం చైవామృతం కుర్యాదమృతం విషమేవ వా | యదిచ్ఛతి కరోత్యేవ సమర్థః కిం నిషిధ్యతే || 37

ఇత్థం విచార్యమాణో%పి భ##క్తైరన్యైః పురాతనైః | భావిభిశ్చ సదా భ##క్తైరిహానీయ మనస్థిరమ్ || 38

లక్ష్మీర్గచ్ఛేచ్ఛావతిష్ఠేన్మరణం నికటే పురః | నిందాం వాథ ప్రకుర్వంతు స్తుతిం వా దుఃఖసంక్షయమ్ || 39

జాయతే పుణ్యపాపాభ్యాం శంకరస్సుఖదస్సదా | కదాచిచ్చ పరీక్షార్థం దుఃఖం యచ్ఛతి వై శివః || 40

అంతే చ సుఖదః ప్రోక్తో దయాలుత్వాన్న సంశయః | యథా చైవ సువర్ణం చ శోధితం శుద్ధతాం వ్రజేత్ || 41

అట్టి కర్మఫలరూపమగు దుఃఖము అధికముగానుండదగినస్థితిలో అల్పముగ నుండునుటలో సందేహము లేదు. లేదా, అది నిశ్చయముగా ప్రారబ్ధము యొక్క దోషమని ఎరుంగవలెను (35). లేదా శంకరుడు అధికముగా గాని అల్పముగా గాని దుఃఖమును అనుభవింపజేసి, అప్పుడప్పుడు తన ఇచ్ఛచే ఆ దుఃఖమును పురుషునకు దూరము చేయుననుటలో సందేహము లేదు (36). శివుడు విషమును అమృతముగను, అమృతమును విషముగను ఎట్లు తోచినచో అట్లు చేయగలడు. సమర్థుడగు శివుని ఎవరు నిషేధించగలరు? (37) పూర్వజులగు భక్తులు ఎందరో ఈ తీరున విచారణను చేసియున్నారు. భవిష్యత్కాలములో కూడా భక్తులు మనస్సును ఈ జ్ఞానమునందు సుస్థిరము చేయవలెను (38). లక్ష్మి ఉండవచ్చును; పోవచ్చును; మరణము ఎదుట నిలబడి యుండవచ్చును; జనులు నిందించ వచ్చును; స్తుతించవచ్చును; కాని భక్తిని చేసినచో దుఃఖము నశించితీరును (39). మానవుడు పుణ్యపాపములచే సుఖదుఃఖములను పొందును. శంకరుడు సర్వదా సుఖమునే ఇచ్చును. కాని శివుడు అప్పుడప్పుడు పరీక్షను చేయుటకొరకై దుఃఖమునిచ్చును (40). ఆయన దయామయుడు గనుక అంతములో సుఖము నిచ్చుననుటలో సందేహము లేదు. బంగారమును పుటము పెట్టి కాల్చినచో మరింత శుద్ధిని పొందును గదా! (41)

ఏవం చైవ మయా పూర్వం శ్రుతం మునిముఖాత్తథా |
అతస్తద్భజనేనైవ ల ప్స్యే%హం సుఖముత్తమమ్ || 42

ఇత్యేవం తు విచారం స కరోతి యావదేవ హి | తావచ్చ సూకరః ప్రాప్తో బాణసంమోచనావధి || 43

శివో%పి పృష్ఠతో లగ్నో హ్యాయాతస్సూకరస్య హి | తయోర్మధ్యే తదా సో%యం దృశ్యతే శృంగమద్భుతమ్ || 44

తస్య ప్రోక్తం చ మాహాత్మ్యం శివశ్శీఘ్రతరం గతః | అర్జునస్య చ రక్షార్థం శంకరో భక్తవత్సలః || 45

ఏతస్మిన్ సమయే తాభ్యాం కృతం బాణవిమోచనమ్ | శివబాణస్తు పుచ్ఛే వై హ్యర్జునస్య ముఖే తథా || 46

శివస్య పుచ్ఛతో గత్వా ముఖాన్ని స్సృత్య శీఘ్రతః | భూమౌ విలీన స్సంయాతస్తస్య వై పుచ్ఛతో గతః || 47

పపాత పార్శ్వతశ్చైవ బాణశ్చై వార్జునస్య చ | సూకరస్తత్క్షణం దైత్యో మృతో భూమౌ పపాత హ || 48

దేవా హర్షం పరం ప్రాపుః పుష్పవృష్టిం చ చక్రిరే | జయపూర్వం స్తుతికరాః ప్రణమ్య చ పునః పునః || 49

నేను పూర్వము మహర్షుల సుఖమునుండి ఇట్టి వచనములనే విని యుంటిని. కావున నేను శివుని మాత్రమే భజించి ఉత్తమ సుఖమును పొందెదను (42). ఈ విధముగా ఆతడు ఆలోచించుచుండగనే ఆ సూకరము బాణము వేయదగిన పరిధిలోనికి వచ్చెను. దాని వెనుకనే దానినే చూస్తూ శివుడు కూడా వచ్చెను. వారిద్దరి మధ్యలో ఆ సూకరము అద్భుతమగు పర్వతశిఖరమువలె కానవచ్చెను (43, 44). దాని గొప్ప దనము ఇంతకు ముందు వర్ణించ బడియుండెను. మంగళకరుడు, భక్తవత్సలుడు అగు శివుడు అర్జునుని రక్షణకొరకు మరింత వేగముగ ముందుకు సాగెను (45). అదే సమయములో వారిద్దరు బాణములను విడిచి పెట్టిరి. అర్జునుడు ముఖమును, శివుడు తోకను లక్ష్యముగా చేసి బాణములను ప్రయోగించిరి (46). శివుని బాణము వేగముగా పుచ్ఛమునుండి దూసుకు పోయి ముఖమునుండి బయటకు వచ్చి భూమిలో కలిసి పోయెను. అర్జునుని బాణము పుచ్ఛము వైపు నుండి బయటకు వచ్చి ప్రక్కనే పడెను. సూకర రూపములోనున్న ఆ రాక్షసుడు వెంటనే మరణించి నేల గూలెను. (47, 48). దేవతలు పరమానందమును పొంది పుష్పవృష్టిని గురిపించిరి. వారు అనేక పర్యాయములు ప్రణమిల్లి జయధ్వానములను, స్తోత్రములను చేసిరి (49).

శివస్తుష్టమనా ఆసీదర్జునస్సుఖమాగతః | దైత్యస్య చ తదా దృష్ట్వా క్రూరం రూపం చ తౌ తదా || 50

అర్జునస్తు విశేషేణ సుఖినా ప్రాహ చేతసా | అహెూ దైత్యవరశ్చాయం రూపం తు పరమాద్భుతమ్ || 51

కృత్వా%గతో మద్వధార్థం శివేనాహం సురక్షితః | ఈశ్వరేణ మమాద్యైవ బుద్ధిర్దత్తా న సంశయః || 52

విచార్యేత్యర్జునస్తత్ర జగౌ శివ శివేతి చ | ప్రణనామ శివం భూయస్తుష్టావ చ పునః పునః || 53

ఇతి శ్రీ శివమహాపురాణ   శతరుద్రసంహితాయాం మూకాసుర వధో నామ ఏకోన చత్వారింశో%ధ్యాయః (39).

అపుడా రాక్షసుని క్రూరరూపమును గాంచి శివుడు సంతసిల్లిన మనస్సు కలవాడాయెను. అర్జునుడు సుఖమును పొందెను (50). అత్యంత సుఖముతో నిండిన మనస్సు గలవాడై అర్జునుడు ఇట్లు పలికెను. ఆశ్చర్యము! ఈ రాక్షసశ్రేష్ఠుని రూపము పరమాద్భుతముగనున్నది (51). ఈతడు నన్ను వధింప నిశ్చయించుకొని వచ్చినాడు. శివుడు నన్ను రక్షించినాడు. వీడు శత్రువు అని నా బుద్ధికి తోపింప జేసినవాడు ఈశ్వరుడే ననుటలో సందేహము లేదు (52). అర్జునుడిట్లు తలపోసి శివుని నామమును స్మరించి శివునకు అనేక పర్యాయములు ప్రణమిల్లి మరల మరల స్తుతించెను (53).

శ్రీ శివ మహాపురాణములోని శతరుద్రసంహితయందు మూకాసుర వధయను ముప్పది తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (39).